## 5. అభావాధికరణము

గురుదేవా ! ముక్తపురుషులకు సంకల్ప మాత్రంచేతనే, కోరిన లోకాలు పొందుతాడు అన్నారు. సంకల్పం ఉందన్నారు. సంకల్పం కావాలంటే మనస్సు కావాలి. అంటే ముక్తపురుషుడికి మనస్సు, ఇంద్రియాలు అన్నీ ఉంటాయా ? అన్నాడు కృష్ణశర్మ వివరిస్తున్నాడు రత్నాకరుడు.

**సూ. 10 అభావం బాదరి రాహహ్యేవమ్**

**అభావం, బాదరిః, అహ, హి, ఏవమ్**

విద్వాంసుడు అంటే జ్ఞానియైన వాడికి మరణానంతరము శరీరముండదు.

ముక్తపురుషుడికి ఇంద్రియలు శరీరము ఉండవు అంటాడు వ్యాసుడు. విద్వాంసుడికి మనస్సుకన్న భిన్నమైన శరీరము, ఇంద్రియాలు ఏవీ బ్రహ్మలోకంలో లేవు.

**సూ. 11 భావం జైమినిర్వికల్పా మననాత్**

**భావం, జైమినిః, వికల్పామననాత్**

జైమిని అభిప్రాయం ప్రకారం ముక్తపరుషుడికి శరీరాదులున్నాయి.

**సూ. 12 ద్వాదశాహవ దుభయవిధం బాదరాయణోఽతః**

**ద్వాదశాహవత్, ఉభయవిధం, బాదరాయణః, అతః**

ఇక్కడ రెండు విధాలైన శ్రుతులు కనిపిస్తున్నాయి. బ్రహ్మలోకాన్ని పొందినవారు స్వతంత్రులు. వారి సంకల్పం తిరుగులేనిది. అందుచేత శరీరం కావాలనుకుంటే శరీరం ధరిస్తారు. అక్కరలేదు అనుకుంటే శరీరం ఉండదు. అని వ్యాసుడు అంటున్నాడు.

**సూ. 13 తన్వభావే సంధ్యవదుపపత్తేః**

**తన్వభావే, సంధ్యవత్, ఉపపత్తేః**

బ్రహ్మ లోకంలో ఇంద్రియాలతో కూడిన దేహం లేకపోయినప్పటికీ, స్వప్నంలో లాగా మానసికంగా విషయాలు పొందుతారు.

స్వప్నంలో అనేక విషయాలు చూస్తాము. పదార్థాలు తింటాము. భోగాలు అనుభవిస్తాము. కాని శరీరము ఇంద్రియాలు ఏవీ ఉండవు.

అవన్నీ స్వప్నంలో యదార్థమే. అలాగే బ్రహ్మలోకంలో భోగాలు మనసు ద్వారానే అనుభవిస్తారు.

**సూ. 14 భావే జాగ్రద్వత్**

శరీరం ఉన్నప్పుడు జాగ్రదావస్థలో లాగా అనుభవిస్తాడు. శరీరం లేనప్పుడు మనసుతో అనుభవిస్తాడు. కాబట్టి ముక్తపురుషునికి శరీరం ఉండటం లేకపోవటం అనేది అతని సంకల్పం వల్లనే జరుగుతుంది. అంటూ ఐదవ అధికరణ పూర్తిచేశాడు రత్నాకరుడు.

## 6. ప్రదీపాధికరణము

గురువర్యా ! ముక్తుడు కావాలనుకుంటే ఒక శరీరమే పొందుతాడా ? లేక ఒకే కాలంలో అనేక శరీరాలు పొందుతాడా ? వివరించండి అన్నాడు నారాయణభట్టు వివరిస్తున్నాడు రత్నాకరుడు.

**సూ. 15 ప్రదీప వదావేశస్తథా హి ధర్మయతి**
**ప్రదీపవత్, ఆవేశః, తథా, హి, ధర్మయతి**

విద్వాంసుని చేత నిర్మించబడిన అనేక శరీరాల్లో విద్వాంసుడు ప్రదీపం లాగా ఆవేసిస్తాడు.

ముక్తుడు ఆత్మభోగం కావాలనుకున్నప్పుడు అనేక శరీరాలు కలుగుతాయి. ఒకే ఆత్మ, ఒకే మనస్సుతో అనేక శరీరాల్లో భోగము అసంభవం. కాబట్టి అనేక ఆత్మలు, మనసులు కల్పించబడాలి. అలా జరుగుతుందా ? అంటే జరగదు. కాని ప్రదీపం లాగా ఆవేసిస్తాడు. అంటే దీపం ఒకటే కాని వత్తులను అంటుకుని అనేక దీపాలవుతుంది. అలాగే ముక్తుడు, తానొక్కడే అయినా అనేక రూపాలు పొందుతాడు. అనేక శరీరాలను ఆవేశిస్తాడు.

**సూ. 16 స్వాప్యయ సంపత్త్యో రన్యతరాపేక్ష మావిష్కృతం హి**
**స్వాప్యయ సంపత్త్యోః, అన్యతరాపేక్షమ్, అవిష్కృతం, హి**

స్వాప్యయము అంటే సుషుప్తి. ఇక్కడ సుషుప్తి, మోక్షము, ఈ రెండింటిలోనూ ఏదో ఒక దానిని ఉద్దేశించి మాత్రమే చెప్పబడింది.

ముక్తపురుషుడు తాను ఒకేకాలంలో అనేక శరీరాల్లో ప్రవేశించగలడు అంటూ ఆవర అధికరణ పూర్తి చేశాడు రత్నాకరుడు.

## 7. జగద్వ్యాపారాధికరణము

"గురువుగారూ ! ముక్తపురుషుడు సంకల్ప మాత్రంచేత జగత్తును సృష్టించగలడా?" అన్నాడు కృష్ణశర్మ. వివరిస్తున్నాడు రత్నాకరుడు.

**సూ. 17 జగద్వ్యాపార వర్జం ప్రకరణాద సన్నిహితత్త్వాచ్చ**

**జగద్వ్యాపారవర్జం, ప్రకరణాత్, అసన్నిహితత్వాత్, చ**

విద్వాంసుడికి అణిమాది అష్టసిద్ధులన్నీ లభిస్తాయి. కాని జగత్తును సృష్టించే శక్తి మాత్రం ఉండదు. ఆ పని పరమేశ్వరుని వల్లనే జరుగుతుంది.

సృష్టి సమయంలో పరమేశ్వరుడు ఒక్కడే ఉంటాడు. అతనికి సన్నిహితులుగాని, అతనితో సమానమైన వారుగాని ఎవరూ ఉండరు.

**సూ. 18 ప్రత్యక్షోపదేశా దితిచేన్నాధికారిక మండలస్థోక్తేః**

**ప్రత్యక్షోపదేశాత్, ఇతి, చేత్, న, అధికారిక, మండలస్థోక్తేః**

విద్వాంసుడికి ఈశ్వరునితో పాటు సమానమైన ఐశ్వర్యం కలుగుతోంది. అంతమాత్రం చేత జగద్వ్యాపారము, జగత్కర్తృత్వము కలగవు. వీరంతా బ్రహ్మలోకంలోనే ఉంటారు. కాబట్టి వీరిశక్తి అక్కడి వరకే పరిమితము. వీరంతా పరబ్రహ్మకు లోబడే ఉంటారు. లోకాలను సృష్టించే అధికారం వీరికి లేదు.

**సూ. 19 వికారావర్తి, చ తథా హి స్థితి మహ**

**వికారావర్తి, చ, తథా, హి, స్థితిమ్, అహ**

పరమేశ్వరుని రూపం వికారమందు మాత్రమే ఉండేదికాదు. నిత్యమైనది కూడా. అంటే సూర్యమండలంలో  మార్పు పొందేదేకాదు. ఇది సగుణము, నిర్గుణము అని రెండు రకాలుగా ఉన్నది అని వేదంలో చెప్పబడింది.

ఈ వికారమంతా పరమేశ్వరుని వ్యాప్తి. ఆయన మాత్రం వికారానికి ఆవల ఉన్నాడు. నిర్వికారుడై ఉన్నాడు. ఈ సమస్త భూతాలు పరమేశ్వరుని యొక్క ఒక పాదము మాత్రమే. మిగిలిన మూడు పాదాలు స్వర్గంలో ఉన్నాయి. ఈశ్వరుడికి సగుణ, నిర్గుణ రూపాలు రెండూ ఉన్నాయి. నిర్గుణ రూపాన్ని సగుణోపాసకులు పొందలేరు.

**సూ. 20 దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే**

**దర్శయతః, చ, ఏవం, ప్రత్యక్షానుమానే.**

ప్రత్యక్షం అంటే వేదం. అనుమానం అంటే స్మృతి పురాణాలు.

జ్యోతి రూపుడైన పరబ్రహ్మ యందు లోకాలను ప్రకాశింపచేసే సూర్యుడు ప్రకాశింపడు. చంద్రుడు కాంతులివ్వడు. తారకలు ప్రకాశింపవు. అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఇవి వేదంలో భాగాలు.

ఇదే విషయాన్ని పురాణాలు కూడా చెబుతున్నాయి. స్వయం ప్రకాశమానుడైన పరమాత్మను సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపచేయలేవు అంటోంది భగవద్గీత.

పరమాత్మది అన్ని తేజస్సులకన్నా అధికమైన తేజస్సు. కాబట్టి సగుణ, నిర్గుణరూపాలు రెండూ ఉన్నాయి.

**సూ. 21 భోగమాత్ర సామ్యలింగాచ్చ**

**భోగమాత్ర, సామ్య, లింగాత్, చ**

ఉపాసకులకు ఈశ్వరునితో పాటుగా భోగమాత్రమైన సామ్యమే ఉన్నదని వేదాలు చెబుతున్నాయి. అందుచేత వారికి జగత్తును సృష్టించే శక్తి, అధికారము లేవు.

సమస్త ప్రాణులు హిరణ్యగర్భుని పూజించినట్లే ఉపాసకులను కూడా పూజిస్తాయి. అంటే హిరణ్యగర్భునికిమల్లేనే ఉపాసకునికి కూడా భోగసాధనాలవుతాయి.

బ్రహ్మలోకం చేరిన ఉపాసకులతో బ్రహ్మ "ఓ ఉపాసకులారా ! ఇక్కడ అమృతరూపమైన జాలాన్ని నేను ఉపయోగిస్తున్నట్లే, మీరు కూడా ఉపయోగిస్తారు". అంటే వీరికి భోగసామ్యమే తప్ప జగద్వ్యాపారం లేదు.

**సూ. 22 అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్**

**అనావృత్తిః, శబ్దాత్, అనావృత్తిః, శబ్దాత్**

అర్చిరాది మార్గం గుండా బ్రహ్మలోకం చేరిన వారికి పునరావృత్తి లేదు.

కఠోపనిషత్తులో చెప్పినట్లుగా బ్రహ్మనాడి గుండా పైకిపోయిన వారు అమృతత్త్వం పొందుతారు. బృహదారణ్యకంలో చెప్పినట్లుగా దేవయానం ద్వారా పోయేవారు మానవలోకానికి తిరిగిరారు.

వీరంతా కల్పాంతం వరకు బ్రహ్మలోకంలోనే ఉండి, కల్పాంతాన పరబ్రహ్మలో లీనమవుతారు. వీరికి మరుజన్మ లేదు.